వ. అని, ఇవ్విధంబునం జక్రి నిర్వక్రి సమ్యగ్జ్ఞానప్రకాశకరంబు లైన వచనంబులు పల్కిన ధరామరముఖ్యుండు సంతసించి యి ట్లనియె.

క. తెలియనివి గొన్నిమాటలు
గల వడిగెద భువనవంద్య కళ్యాణసము
జ్జ్వల రూప నాకుఁ గ్రమ్మఱఁ
దెలుపుము చిత్తంబులోనఁ దెలివి తలిర్పన్.

సీ. యమ మెన్నివిధములు శమ మన నెయ్యది
దమ మేది ధృతి యేది దాన మేది
తప మే విధంబు సత్యత్యాగ ధన యజ్ఞ
దక్షిణావిద్యలుఁ దనర నెవ్వి
లక్ష్మియు సుఖ దుఃఖ లజ్జ లనా నెవ్వి
పండితమూర్ఖు లే పగిదివారు
మార్గోత్పథంబుల మహిమ లే విధములు
స్వర్గనారకముల జాడ లెవ్వి.

గీ. బంధు లెవ్వారు గృహమేధి పరగ నాఢ్యుఁ
డనఁగ నెవ్వఁడు ఘన దరిద్రాంధకార
సహితుఁ డెవ్వఁడు నాథుఁ డే జాడవాఁడు
దీనమందార యివి నాకు నానతిమ్ము.

వ. అనిన విప్రవరునకు గోపికావల్లభుం డి ట్లనియె.

క. నీ వడిగిన యీ ప్రశ్నల
కే వంకను నవతు లేద యీ భావము నీ
భావంబున కొడఁబడ సం
భావన నెఱిఁగింతు నీకుఁ బటువాక్ప్రౌఢిన్.

వ. ఆకర్ణింపు మది యె ట్లనిన నహింసయు, సత్యంబును, కార్యరాహిత్యంబును, అసంగమంబును, అసంచయంబును, ఆస్తిక్యంబును, బ్రహ్మచర్యంబును, మౌనంబును, స్థైర్యంబును, క్షమాభయంబు

లును, శౌచంబును, జపంబును, తపంబును, హోమంబును, అతి
సత్కారంబును, మదర్చనంబును, తీర్థస్నానంబును, పరమయోజ
కర్తృత్వంబును, తుష్టియు, ఆచార్యసేవనంబును నివి యమం బనా
బరగు. సర్వేంద్రియనిగ్రహంబు శమంబు. శత్రుమిత్రాదు
యందు మాధ్యస్థ్యంబు భజియించుట దమంబు. జిహ్వామేహ
జయంబు ధృతి. మూఢమతులకు జ్ఞానోపదేశంబు చేయుట దానంబు
కామత్యాగంబు తపంబు. సమదర్శనత్వము సత్యంబు, కర్మాసంగ
మంబు త్యాగంబు, వైష్ణవధర్మార్జనం బిష్టధనంబు, మ ల్లక్షణం
బెఱుంగుట యజ్ఞంబు, సూక్ష్మజ్ఞానం బడుగుట దక్షిణ, ప్రాణ
యామంబును, నిశ్చలభక్తి, విద్యలనఁ దనరు శమాది గుణంబులు
లక్ష్మి, ఆశారాహిత్యంబు సుఖంబు, కామసుఖాపేక్ష నిశ్చయం బగు
దుఃఖము, బోధను వికర్మంబులయందు ప్రవర్తనంబు మాన్పుట
లజ్జ, బంధమోక్షణమార్గజ్ఞుండు పండితుండు, దేహాదుల యం
దహంకారంబు బొందినవాఁడు మూర్ఖుండు, మద్భక్తిమార్గంబు చిత్త
విక్షేపం బుత్పథంబు, సత్త్వగుణోదయంబు స్వర్గంబు, తమో
గుణోదయంబు నరకంబు, గురువు బంధువుం డనాఁ బరగు, నిజ శరీ
రంబు గృహంబు, గుణాఢ్యుం డాఢ్యుండు, తుష్టిలేని యతండు
దరిద్రుండు, సర్వసంగ విరక్తుం డీశ్వరుండు, అని ప్రశ్నోత్తరంబు
లిచ్చి వాసుదేవుండు మరియు నిట్లనియె.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## ప్ర తి ష్ఠా ప కు లు.

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు సి. బి. ఇ. డి. లిట్., పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉ ద్ధా ర కు లు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అ ధ్య క్షు లు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది బిరుదాంకితు లగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

## కా ర్య ద ర్శు లు:

శ్రీ సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఒ. యల్.

శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కో శా ధ్య క్షు లు:

శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు, బి, ఏ, యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ, బి. యల్.,

## కార్యనిర్వాహక సభాసభ్యులు:

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ, బి. యల్.

శ్రీ కొమ్మిరెడ్డి కేశవ రామమూర్తినాయఁడుగారు, బి. ఏ.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, ఎం. ఏ. బి. ఇడి.

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఎ.

శ్రీ ఏచూరి సీతారామారావుగారు, బి. ఎ.